


శ్రీరస్తు.

శ్రీ హయగ్రీవాయనమః.



ఇది.

శ్రీ కౌండిన్యసగోత్ర పవిత్ర

చిల్లర రామకృష్ణాఖ్యపుత్ర ఆంజనేయ

ప్రణీతంబయిన

# శ్రీమద్ మహారాజరాజేశ్వరీ దండకము.

నంబూరి వెంకటసుబ్బయ్యగారిచే సవరింపబడి

యేర్లగడ్డ వెంకటేశ్వరరావుగారిచే

పునాదిపాడువారు ప్రకటింపబడెను.

DUGGIRALA.

PRINTED BY V. NIRANJANA SASTRI

AT PRABODHINI PRESS.

1911.

వెల 0-1-0.

మఱిం పెక్కు మార్గంబులఁ ధాత్రి నీరూపు రేఖా
విలాసంబు వర్ణింప యాశేష భాషాధిపుల్ గానగా
లేరు నిన్నెంచ నేనెంతవాఁడఁ దయాదృష్టివీక్షించి
రక్షించుమాదేవి నీశక్తి శుభ్రప్రభల్ వీరధైర్యంబు
నఁ జక్షులఁ ముక్కు కన్బొమ్మలందంబులఁ నేత్రప
ద్మంబులఁ చంద్రబింబాననంబుల్ గళంబుల్ భుజం
బుల్ కరంబుల్ నితంబద్వయంబుల్ విడంబించు ర
త్నాంబరంబుల్ మణుల్ చెక్కు చొక్కంబులా
కంకణారావముల్ ఆణిముత్యాలహారావళుల్ చారు
వజ్రాల చేర్ చుక్కబొట్టుఁ మఱిం కెంపురాకట్లు
ముంగాముఱాల్ సరాల్ ధళల్ గుల్కు చౌకట్లు
గుండ్లఁ మఱిఁ పూలచెండ్లఁ మదేభేంద్ర కుంభం
బులఁ గెల్పు పాలిండ్లపై రత్నమాల్యంబులఁ గం
ధకర్పూర పన్నీరునాయత్తరుం మొన్న సద్వస్తువుల్
శిస్తుగా బూసి తానజ్ర వైఢూర్య గోమేధికస్థాపితం
బయిన మేల్ భూషణంబుల్ తగఁ దాల్చి తాచా

ది జవ్వాది కస్తూరికాకుంకమల్ చాల పుల్కాంకి
తంబయిన నీదివ్య సందీప్తుల్ దిక్కుల్ పిక్క
ట్లింగ ఓయక్కలమ్మా ఇకం బక్కలమ్మా వగల్
నిమ్మలమ్మా తెగుల్ తుమ్మలమ్మా పరాకమ్మయో
కొమ్మ నీవెంత మాయావి రూపాంగివే నంగలమ్మా
మరిం చెంగులమ్మా పదేమావులమ్మా యిదే రావు
లమ్మా ఫకీగుబ్బలమ్మా పీకీబొబ్బలమ్మా రణాంపాం
గులమ్మా ఝుణాంనూగులమ్మా యరంజోగులమ్మా
తరంబయిన చండ్లమ్మ కండ్లమ్మ పండ్లమ్మ గుండ్లమ్మ
మారెమ్మ నారెమ్మ పేరమ్మ కోరెమ్మ పోలెమ్మ
జాలమ్మ బాలమ్మ చీలెమ్మ మైసమ్మ హైసమ్మ హైసా
క్కు నాగమ్మ యోంకారి జ్యోతిల్ మయా కారివే
చిట్టివే పొట్టివే చిత్రపాన్నారి బల్ దంతివే కాంతిచే
బంతివే యింతినిన్నంగ నాశ్రేణి మోదంబుతో నెం
తురేయమ్మ కొమ్మారి యల్లమ్మ తమ్మార పుల్ల
మ్మ చండోలుబండ్లమ్మ పొంమూరిగండ్లమ్మ మద్దూరి

పెద్దమ్మ యోమద్దిరాలమ్మ శ్రీశైలవంశాబ్ధిచంద్రుండు
తిర్వెంగళాచార్యుచే శంఖచక్రాంకితంబైన యద్దంకి
నాంచారి వేయమ్మ ధర్మకొండగంగమ్మ పడుమూరినీలమ్మ
పొన్నూరినాగమ్మ మద్దాలిమారెమ్మ పల్లెలం వల్లెమ్మ
బందారువార్యమ్మ యామాగ లంపూడినాయంకి వే
దావులూర్గంగి వే పెద్దచాగర్లమూడి మహంకాళి వే
కాళికాశక్తి వే కనకదుర్గాంబ వేయమ్మ యనగ్టుసీళ్లమ్మ
కోటప్పకొండమ్మ గుంటూరుమంత్రమ్మ కోడేటిబల్
ముంగ్లమూరమ్మ నాదెళ్లబంగ్లమ్మ యోచిలకలూ
ర్పేట దేవమ్మ పాలపర్తికి వే పుప్పులూరెల్లి వే వంగ
వోల్గంగి వే యాదిపూడింకి వే పల్లెకూన్ తల్లి వేయమ్మ
కొల్లేటి పెద్దమ్మ పులినర్తిసింగమ్మ వోరేటి పోలమ్మ
రేపల్లెచంద్రమ్మ అట్లూరిమల్లమ్మ పొన్నూరు ముత్త
మ్మ యెన్నూరు యెంకమ్మ మన్నూరు బాలమ్మ క
ణ్నూతలచ్చమ్మ యూకారుమంచి మహాలక్ష్మి వే తల్లి
పునాదిపాటి మహాగంగి వే సింగిరినామవిఖ్యాతి ఘా

శేషులఁగేరి యాసర్వలోకంబులఁ గుక్షిలోనుంచి
పంచాక్షరీనామధేయంబునై యున్న నీదివ్యమాయా
విలాసంబు వర్ణించువారుం గుణంబెంచువారుఁ నిదా
నించువారుఁ విరాళించి కీర్తించువారున్మహాభక్తిచే
పేదలుఁ పాదలుఁ సోదరభ్రాతసద్బంధువర్గంబులుఁ
బ్రాహ్మణుల్ క్షత్రియుల్ వైశ్య శూద్రాదులుఁ జేరి
యామానవశ్రేణినిస్వేయచందంబులం బూజలుఁ
జేసి నిష్టంబులర్పించి సంతుష్టిగావించి సచ్చింతనల్
గాంతురే పద్మగర్భాండ భాండోదరీ సుందరీ పాం
దుగా యందరున్నీదుమాయావిభేదంబులో గొంత
విభ్రాంతులై మేనులుప్పొంగి బల్ సందడింపొందుగా
జేయుచా వందనంబుల్ సమర్పించుచా వీరు లంగళ్లు
పొంగళ్లు వేర్వేరుగా సారకావళ్లు పట్టాదిగా సాగునూ
గ్లుంచు తట్టాది బంగారుపార్వేటలుఁ గొమ్ముపాట్టెళ్లు
నాదున్న లాకుక్కుటంబుల్ మరిఁ గరూకలాగండదీ
పంబులానక్షతల్ గారెలాబూరెలాజ్యోతులాసేసులా

ఖర్జూరల్ చక్కెరల్ పిండికూరల్ సురాసారభాండం
బులన్ చాలబొబ్బట్లు ఖజ్జాయమూకొబ్బరాబెల్లమూ
చుట్టలారొట్టెలా కుడుములుండ్రాళ్లు నాకారమూపంచ
దారల్ మహాపానకాల్ పప్పులాపప్పుసు పండ్లున్
ఘనంబైన కట్నంబులాసేతపుష్పంబులాదట్టమైయున్న
కంబాల మేల్ కావిచీరాదిగా గొప్పముప్పొగువారం
చు గోరంచునాథాటికర్పూరంచు తెక్కించినవ్వాల్ వళు
ల్ హారతుల్ నియ్య నాషూప దీపంబు తాంబూల
కూదక్షిణల్ శోడ సర్పించగా ముద్రగడ్పానసంబెగ
బొల్లేవులాడంగ యూవేపచీరెల్ ధృవాళింపగా వుల్ల
డల్ శింవగంభీరభేరీ మృదంగంబులున్ డోళ్లు సన్నా
యిలుగొలప్పెట్టల్ తాళముల్ కొమ్ములుపంబజోళ్లా
జమిల్ కల్ మహామంచి తాషామృపల్ మోర్రియా త
ఝ్ఝుంఝ్ఝుఘుణ్ఘంత తాకిటధక్కిట దధ్ధంక నాన్నవ్వు
నన్నన్న డాన్ధ్గంకుఘర్ధ్గంగు తాళన్ గుతళ్లంగుఘూ
ఘూహీభూఘూహీ డిడ్లాంకుడిడ్లంకు తద్ధిద్దధ్ధిక్కు

కంకణ ఖణాం కంఖణాంబంగు బల్భోరుకాల్పాంగ
యాత్రిత్తులుగా మూల్గ నావేశ జైసీక్లలో కొందరు
న్నంకణా తెత్తి తాశుమ్దులుకా జెప్పగా కొల్లకొల్లాడ
యెక్కిర్ల యెక్కిర్ల జోగత్తి జోగత్తి మాతంగినా
ట్యాంబులాతంగ శివ శక్తులుం గంతుశేయాంగ నా
ఫూలకప్పెల్లు యారక్తకప్పెల్లు నార్భాటముల్ శేయు
చామానవ్రశేశి కాబాబ్బలుంబెట్టుచా కేసరాల్
గొట్టుచాపిరదాల్లేయుచా కిర్రలుగా గొట్టుచా వెర్రి
కేకల్కు కొందర్ గణాచాల్లగానూగ స్నానంబు జే
యించి బండార్లుబెట్టించి ధూపంబు శేయించి వేపమం
డలిప్పించ నూగూగి నట్టూగి యిట్టూగి తాసాక్కు
చుగా సోలుమగా తాళశేనంచు హానిల్వ్యశేనంచటం
చుగా నిటంచుగా మరింకేరిగుడ్లెర్రగా జేసి యూవూరుని
డ్చానుయూదారినొచ్చానుయూపూరికొచ్చానుయం
కమ్మనంచుగా మహామారినంచుగా మహాపోలినంచుగా
మహాలక్ష్మినంచుగా మహంకాళినంచేను యూచు

ట్టలారొట్టెలా కారముఙ్గ్రడాళ్ల సాహేబులంచుఁ
మముంజూడుకేయంచు మీపూర్వ జేపాటు చూడం
చు మావెబ్బచూడంచు మామాట మర్యారటం
చుఁ మరింజూనుమంచుఁ నిఖం జూడు మంచిప్పు
డుఁ మాకు యాజాతరుల్ కేసి యాపోతులంగోసి
పాల్యాకళ్లు గల్పించి పాళ్యేకలేయించి పాళ్యేర్ల
జల్లించి బల్ వెంటనే కొల్పులంజేశి యాకుంభము
ల్ బోశి దున్నలకదుఁసర్కు నాయాటలుఁ గొట్టి
యాకోళ్లజంపించి నాధూపదీపంబు తాంబూలమా
దక్షణాల్ తోడ బల్ మాకుబెట్టించి హామమ్మ బం
పించ మొంబోదుమంచుఁ మరింజెప్పగా నప్పుడామా
నవ్రశేశి విభ్రాంతులై నందరుఁ భీతినింజెంది యాకీ
తీగా జేయగాకొందరత్తుయత్తు నగ్గుండి వంగుండి
నిండాగ్లగా గంపలోనాలతోరాగ నాకొక్కచో
టాదు తాలిమ్మ తాలిమ్మ తాలిల్లి తాలిల్లి లిల్లా
హీ లిల్లాహీ లిల్లల్లి లిల్లల్లి హైసాక్కు హైసాక్కు

హైసాక్కొట్టుచున్ ;కరాళించుచున్ మీసముల్
గీటుచున్ కేరిగుడ్లెర్రగాజేసి బల్ ధాటికొంగోల వా
ల్యాకకత్తుల్ ఢళల్ దిక్కులం పిక్కటిల్లంగ బంట్లున్
ప్రభల్ నాగిలో నేగిసి చుట్టునన్ నేగుచుండంగ నాబం
డిముందంచు మాబండిముందంచునం ముందుమా
డంచు పోనీకుపోనీకు నీవెంత మీరెంత వారెంత
వీరెంతయంచున్ మహాక్రోధమెచ్చంగ వాక్వీరలంవీ
రునుంవారలం తారసిల్లంతమన్నంతకున్ తన్నుతన్నం
చుపోట్లుకొట్లంచు యుద్ధప్రసంగంబులుంజేయగా
దెబ్బలుంగొట్టుకొంచుంతగా ముక్కులున్ రేగి రక్తప్ర
వాహంబులుంగాగ నాబండ్ల గట్టుంచు యామొద్దు
లున్ద్రెంచుకన్ యద్ధరోపోవగా కీలఖేలాలమైగోల
కాగ్గోలమై చూచుచూడంచు మాదెబ్బచూడంచు
మాపోటుచూడంచు నాకేసులుంజేయగా రోషము
లగ్గ యావందలున్వేలుద్రవ్యంబుగాజేసి తారాజ
నామాలునున్ దాఖలున్ జేసి నీతీరునేకేట నీగా

ల్చుకొంటుందురేయమ్మ నిన్నన్నిరూపాలవర్ణింతు
రే యింతులత్యంత మోదంబుతో చాలవార్వేతురే
యమ్మ కూశాటకుండమ్మ కోటల్లఘెండమ్మ మోచ
ర్లకోటమ్మ రాచెర్లపాటమ్మ వాకట్లపైరమ్మ తాకట్ల
తైరమ్మ కొండాలగారమ్మ పెండేలవీరమ్మ సైరింపు
నారమ్మ వైరంపు సూరమ్మ బాజాపుజాజమ్మ కూ
జాలగురవమ్మ ఓనిర్మలాకారిణే నిర్దయారూపిణే రా
యగయ్యాళిణే రేణుదయ్యాలమా గంగిణె శింగిణె
మంగిణె రంగిణె యచ్చిణె బుచ్చిణె లచ్చిణేపిచ్చిణే
పోలిణె జాలిణె బాలిణె చీలిణె మారిణె నారిణె యీ
రిణె కోటిణె యుంమ సమ్మక్క దండంబు లావందమా
నందముప్పొంగ దేవేంద్రభోగంబుగా గంద్రగోళంబు
నై యింద్రమహేంద్ర జాలంబులన్నట్లు బల్‌దివ్యహా
రావళ్యదార్చి వజ్రాలుగూర్చింది యున్నట్టి మేల్
పల్లకీలెక్కరావమ్మ మోతల్లి యూర్వాల వంశాన్వ
యాంభోది సోముండు నాబ్రహ్మ జాతుండగు

చిల్లరా రామకృష్ణాఖ్యురీనందనాంబయ్యా దాసుఁ.
మహామోక్ష సామ్రాజ్య సంపత్కరుం జేసి దీవించి
దివ్యామృతావృష్టిచే బల్ దయల్వారగావించి గక్షిం
చుమమ్మా సర్వగ్రామాలకుఁ దేవదేవీ మహాదేవ దేవి
నమస్తే నమస్తే నమస్తే నమః.

ఇట్లు,

శ్రీమత్ మహారాజరాజేశ్వరీ దండకము.

సంపూర్ణము.



